# కుల నిర్మూలనకై గళమెత్తిన సదస్సు

## కుల నిర్మూలన – తులనాత్మక పరిశీలన




**డా.బీఆర్ అంబేద్కర్ రచన "కుల నిర్మూలన"పై సమాలోచనా సమావేశం**

**2022, మే, 15. రావులపాలెం, డాక్టర్. బీఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లా**

**ఉపన్యాస సంకలనం**


**లెనిన్ బాబు పెద్దింశెట్టి**

**సామాజిక కార్యకర్త, అంగర, కపిలేశ్వరపురం మండలం**

**డా.బి.ఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లా. సెల్: 98666 64333**




**అంబేద్కర్ ఆలోచనలు ఆచరణ బాట పట్టాలన్న వక్తలు**

**కుల నిర్మూలన ప్రాధాన్యతను చాటిచెప్పిన సదస్సు**

**అంబేద్కర్ రచనల అధ్యయనం తక్షణ అవసరం**

**వ్యక్తి ఆరాధనకు పరిమితం కావడంతో ఉద్యమ గమనం దెబ్బతింటుంది**

**శ్రామిక ఉద్యమాల ప్రాధాన్యతనూ గుర్తించాలని ఉద్ఘాటన**

# ఉపోద్ఘాతం



కులం... ప్రపంచంలో మరెక్కడా కనిపించని, వినిపించని అంశం. భారతదేశంలో ప్రత్యేకతను సంతరించుకున్న ఆ కులం కారణంగా భారతీయులు కుల ప్రాతిపథికన విభజితమైవున్నారు. తరతరాలుగా అణగారిన కులాలవారు వివక్షకు గురవుతూ ఉన్నారు. ఆధునిక కాలమని గొప్పగా చెప్పుకునే నేడు సైతం ఏదొక మూల కుల భావనలు చక్కర్లు కొడుతూనే వున్నాయి. ఈ నేపథ్యంలో అణగారిన కులాల ప్రజలు తీవ్రమైన శారీరక, మానసిక హింసకు గురవుతూ వస్తున్నారు. వీరిపై సాగిన వివక్ష తీరును, ప్రభావాలను వివరిస్తూ అనేక పుస్తకాలు రానే వచ్చాయి. కులభావనకు గురికాని కులం లేదంటే ఆశ్చర్యంకాదనిపిస్తుంది. ఉన్నతకులాల్లో సైతం కులకట్టుబాట్లుకు మహిళలు తీవ్రంగా నష్టపోతున్నారు. ఉన్నత కులాల్లోని ఉప కులాల ప్రజలు ఆ ఉన్నత కులాల వారు నుంచి వివక్షకు గురవుతున్నారు.

ప్రపంచ మానవాళి మొత్తం ప్రగతిపథాన ముందుకు సాగుతున్నప్పటికీ భారతదేశంలో కుల భావనలు బలంగా వేళ్లూనుకోవడానికి కారణాలనేకం. మేథావుల నుంచి సామాన్య ప్రజలు వరకూ కులంపై రకరకాల విశ్లేషణలు, వ్యాఖ్యానాలు చేస్తూనే వున్నారు. చిన జీయ్యర్ స్వామీజీ ఏకంగా కులమనేది ఉండితీరాలి అని మీడియా ముఖంగానే చెప్పారంటే కుల భావనల వేళ్ళు మతంలోనుంచే చొచ్చుకువచ్చాయనడానికి ప్రధాన ఆధారం.

భారతదేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలను ఛిన్నాభిన్నం చేస్తున్న కులంపై లోతైన అధ్యయనం చేసినవాడూ, విశ్లేషించి కుల నిర్మూలనకు మార్గం చూపిన ఘనతగలవాడూ, కుల వివక్ష తొలగింపుకోసమూ, కుల నిర్మూలన కోసమూ జీవితాన్ని త్యాగం చేసినవాడూ డాక్టర్ బీఆర్.అంబేద్కర్. కులంపైనా, కుల నిర్మూలనపైనా దేశంలో ఎంత అస్పష్టత నెలకొన్నదో అంబేద్కర్ జీవితాన్ని, రచనలను అర్థం చేసుకోవడంలోనూ అంతే అస్పష్టత కొనసాగుతుందనిపిస్తుంది. అందుకే కుల నిర్మూలనకై అంబేద్కర్ ఏం చెప్పారన్న అంశంపై చర్చించేందుకు పిఠాపురానికి చెందిన కుల నిర్మూలనా సమాఖ్య నాయకుడు ఎం.గౌరవ్ ఓ కృషిని ప్రారంభించారు.

2022, మే 15, ఆదివారం డాక్టర్ బీఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లాలోని రావులపాలెం ఏకలవ్య శిక్షణ కేంద్రంలో అంబేద్కర్ విశిష్ట రచన "కులనిర్మూలన'పై చర్చా కార్యక్రమాన్ని నిర్వహించారు. ఏకథాటి ఉపన్యాసలతో ప్రయోజనం ఉండదని ముందుగానే గ్రహించిన మిత్రుడు గౌరవ్ పుస్తక సారాంశంపై చర్చించే పద్ధతిని సూచించారు. హాజరైన పెద్దలు సైతం దాన్ని ప్రశంసించి విలువైన అభిప్రాయాలను వ్యక్తం చేశారు. కుల నిర్మూలనకై సాంఘిక ఉద్యమాలను చేయడంతో పాటు యావత్ సామాన్య ప్రజల విముక్తికై మార్క్స్ మహనీయుడు సూచించిన వర్గ పోరాటం చేయాల్సిన ప్రాధాన్యతను ప్రముఖులు నొక్కి చెప్పారు. మహనీయుని అంబేద్కర్ రచన వచ్చి 86 సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా నిర్వహించిన చర్చా కార్యక్రమంపై సంక్షిప్త వివరణలు, వక్తల ఉపన్యాసాలను సంకలనం చేసే ప్రయత్నం చేసినందుకు సంతోషంగా వుంది.

**లెనిన్ బాబు పెద్దింశెట్టి, అంగర, డా.బీఆర్ అంబేద్కర్ కోనసీమ జిల్లా. సెల్: 98666 64333**

# ప్రయత్నం సంతృప్తినిచ్చింది



ఒకనాడు బహిరంగంగానే అత్యంత దుర్మార్గానికి పాల్పడిన కుల భావన నేడు చాలా సున్నిత అంశంగా మారిపోయినట్టు కనిపిస్తుంది. ఆధునిక కాలంలో నూతనత్వాన్ని ధరించిన ఆ కులం ఏమాత్రం తన ప్రభావాన్ని కోల్పోకుండా వివిధ పద్ధతుల్లో కొనసాగుతూనే ఉంది. రోజువారీ జీవితంలో ఏదొక సమయంలో కులం ప్రభావానికికి గురికాని భారతీయుడు ఉండరనిపిస్తుంది. కులంపేరుతో వివక్ష చూపడం ఒక పక్కన జరుగుతుండగా ఆ వివక్షను రూపుమాపాలన్న లక్ష్యంతో కృషి చేసే ప్రగతిశీల శక్తులకు సైతం కులాన్ని ఆపాదించే ప్రయత్నం మరో పక్కన ఈ దేశంలో జరుగుతూనే ఉంది. దాని వెనుక సాంఘిక కారణాలతో పాటు రాజకీయ కారణాలు కూడా ఉండటంతో అలా జరుగుతుంది. సమాజ హితంకోసం పాటుపడిన మహనీయులకు సైతం కులాన్ని ఆపాదిస్తూ వ్యక్తి ఆరాధనలు చేయడం పరిపాటిగా మారింది.

మహనీయుడు డాక్టర్ బీఆర్ అంబేద్కర్ రచన "కుల నిర్మూలన" పుస్తకంపై చర్చించాలనుకున్నాను. అందులో భాగంగా విభిన్న సంస్థలకి ప్రాతినిధ్యం వహిస్తున్న పెద్దలతో చర్చించాను. కుల నిర్మూలన మార్గాలపై భిన్న అభిప్రాయాలు కలిగి ఉన్నప్పటికీ కుల నిర్మూలనే లక్ష్యంగా కృషి చేస్తున్న వారిని ఒకచోటికి చేర్చాలనుకున్నాను. కొందరు మిత్రుల సహకారంతో కులనిర్మూలన సాధ్యా సాధ్యాలు, సాధకబాధకాల గురించి కూలంకషంగా మాట్లాడుకునేందుకు అలా వేదిక కుదిరడంతో ఆ ప్రయత్నం ఫలప్రదమైంది.

సమాలోచనలో పాల్గొన్నవారంతా తమ భావాలను వ్యక్తపర్చుతూనే విభిన్న భావాలను సైతం నమ్రతతో స్వాగతించారు. అందుకు గల కారణాలను అడిగి తెలుసుకున్నారు. ఎంత సేపు మాట్లాడాలని కానీ, ఏ విషయాలను మాట్లాడాలని కానీ నిర్వాహకులముగా ఎలాంటి పరిమితులను నిర్దేశించలేదు. చర్చల్లో నాణ్యతకోసం అంబేద్కర్ రచన కులనిర్మూలన పుస్తకాన్ని చదివినవారే సమాలోచనకు రావాలని సూచించాము. ఎవరి తర్వాత ఎవరు మాట్లాడాలో కూడా నిర్దేశించకుండా కార్యక్రమాన్ని నిర్వహించాం. ముందస్తుగా మాట్లాడిన మాటలను తిరిగి చెప్పడమెందుకన్న భావనలో తర్వాత మాట్లాడిన వారు కొత్త విషయాలకు ప్రాధాన్యతనివ్వడం ద్వారా సమయాన్ని సద్వినియోగం చేసుకోగలిగాం.

వారి ఉపన్యాసాలను సంకలనం చేయాలనే ఆలోచన చేసిన మిత్రుడు పెద్దింశెట్టి లెనిన్ బాబును అభినందిస్తున్నాను. మాట్లాడినవారి పట్లగానీ, వారి సంస్థల పట్లగానీ ఎలాంటి ఆరాధనభావమూ కనబర్చకుండా ఎవరు ఎంత మాట్లాడితే అంతగా వారి అభిప్రాయాను యధావిధిగా సంకలనంలో పొందుపర్చానని లెనిన్ బాబు చెప్పారు. ఈ పుస్తకంలో కల్పితాలుకానీ, ప్రాధాన్యతల్లో ఎక్కువతక్కువలు కానీ లేకుండా జాగ్రత్తపడటాన్ని అభినందిస్తున్నాను.

**ఎం. గౌరవ్, పిఠాపురం, సమాలోచన నిర్వాహకులు, కుల నిర్మూలనా సమాఖ్య**

**కాకినాడ జిల్లా. Cell: 90320 94492, 2022, జూన్ 28.**

## కుల నిర్మూలన పుస్తక పరిచయం

హిందూ సంఘం నుంచి కుల వ్యవస్థను నిర్మూలించడమే లక్ష్యంగా సవర్ణ హిందూ సంఘ సంస్కర్తల ఏర్పాటుతో జాత్-పాత్-తోడక్ మండలి ఏర్పడింది. మండలి కార్యదర్శి సాంతారామ్ తమ సమావేశంలో మాట్లాడాల్సిందిగా డా.బీఆర్ అంబేద్కర్ ను ఆహ్వానించారు. సమావేశంలో మాట్లాడేందుకు 1935, డిశంబర్ లో తన ఉపన్యాసాన్ని తయారు చేసుకుని ప్రింటింగ్ చేశారు. కానీ అంబేద్కర్ ను పిలవడంవల్ల పంజాబ్ లోని హిందువులు మండలికి వ్యతిరేకమయ్యారు. దీంతో జాత్-పాత్-తోడక్ మండలి అంబేద్కర్ కు కొన్ని సూచనలు చేశారు. తన ఉపన్యాసంలో వేద అనే పదాన్ని తొలగించమన్నారు. ఉపన్యాసంలోని అంశాలు తన వ్యక్తిగతమైనవనీ, జాత్-పాత్-తోడక్ మండలికి సంబంధంలేనివని చెప్పమన్నారు. ఇలాంటి అనేక సూచనలు చేసి హాజరుకావాలని కోరారు. అందుకు అంబేద్కర్ తిరస్కరించారు. అస్పష్టమైన పదజాలం వాడటం తనకిష్టంలేదని, ఉపన్యాసాన్ని మార్చాలని మీరు భావిస్తే మహాసభను రద్దు చేసుకోవచ్చని అంబేద్కర్ స్పష్టం చేశారు. అభ్యంతరాలు చెబుతున్న నేపథ్యంలో నా అధ్యక్షతన మహాసభ రద్దయ్యిందని ప్రకటించాడు.

ఆ నేపథ్యంలో కులనిర్మూలన పుస్తకం ముందుకొచ్చింది. ఈ పుస్తకంలో కులం తాలూకు పునాదులు, వాటి మూలాలు, హిందూమతం భావనలు, సాంఘిక ఉద్యమాల ప్రాధాన్యత, భారత స్వాతంత్ర్యంపై తనకు కలిగిన ఆలోచనలు, జాతీయ కాంగ్రెస్ పార్టీ పట్లా, సోషలిస్టులపైనా, వారి ఉద్యమాలపైనా తనకు గల ఉద్దేశాలను ఈ పుస్తకంలో అంబేద్కర్ స్పష్టంగా వివరించారు. మొత్తంగా ఈ పుస్తకాన్ని చదవడం ద్వారా కుల నిర్మూలనపై అంబేద్కర్ కు గల అవగాహనను అర్థం చేసుకునే వీలు కలుగుతుంది.

ఈ పుస్తకానికి హిందూ ప్రజల నుంచి ఊహించరాని ఆదరణ లభించింది. కుల వ్యవస్థను నిర్మూలించడం అనేది వర్ణాంతర వివాహాల వల్లనూ, వర్ణాంతర భోజనాలవల్లనూ సాధ్యంకాదనీ, ఏ మత విశ్వాసాల పై, భావనల పై కులవ్యవస్థ నిర్మించబడిందో ఆ భావనలను సమూలంగా నిర్మూలించడమే మార్గమనీ అంబేద్కర్ స్పష్టం చేశారు.

అస్పృశ్యులపై దాడులెలా చేసేవారో చెబుతూ 1936 ఏప్రియల్ 1వ తేదీ ఒక అస్పృశ్యుడు మతపరమైన యాత్ర ముగించుకుని తన తోటి అస్పృశ్యులకు ఒక విందు ఏర్పాటుచేసి నెయ్యి పదార్థాన్ని వడ్డించాడని, నెయ్యిని వినియోగించిన కారణంగా హిందువులు చిందరవందర చేసి దాడికి పాల్పడ్డారని వివరించారు. ఒక దేశాన్ని పరిపాలించే అర్హత మరొక దేశానికి లేదనే “మిల్" దొర సిద్ధాంతాన్ని పదే పదే వల్లించే ప్రతీ కాంగ్రెసు వ్యక్తి ఒక వర్గం ప్రజల్ని అణగ దొక్కి ఉంచే అధికారం మరొక వర్గానికి లేదనే విషయాన్ని అంగీకరించితీరాలని అంబేద్కర్ ప్రశించారు.

మనుషులు కేవలం ఆస్తి, సమానత్వం కోసం మాత్రమే విప్లవంలోపాల్గొనరని, విప్లవం తరువాత తాము కులమత విభేదాలు, విచక్షణలు లేకుండా అందరితో సమాన ప్రతిపత్తితో ఉంటామని తెలిసిప్పుడే వాళ్ళు విప్లవంలో పాల్గొంటారంటూ కమ్యూనిష్టుల వైఖరినుద్దేశించి అంబేద్కర్ వ్యాఖ్యానించారు. విప్లవానికి ముందే కులవ్యవస్థతో సోషలిస్టులు ఢీకొనకపోతే విప్లవం తరువాత అయినా వారు దానితో తలపడక తప్పదని అంబేద్కర్ అన్నారు.

## సమాలోచనా కార్యక్రమంలో పాల్గొన్న ప్రముఖులు..

01. డాక్టర్ చిలుకోటి కూర్మయ్య, బహుజన మేధావి, రచయిత, రాజమహేంద్రవరం.

02. మలసాని శ్రీనివాస్, కులనిర్మూలన వాది, కాకినాడ.

03. డాక్టర్ చెలికాని స్టాలిన్, అధ్యక్షులు, డా.చెలికాని రామారావు స్మారక సమితి, రామచంద్రపురం.

04. డాక్టర్ చల్లా రవికుమార్, సంగమం సాంస్కృతి వేదిక నిర్వాహకులు, మండపేట.

05. ఆకుమర్తి రవి, మానవహక్కుల వేదిక, అమలాపురం.

06. పాతగొలుసు రవికాంత్, సహవాసి స్వాభిమాన వేదిక, కోరుకొండ.

07. ముత్యాల శ్రీనివాసరావు, పెరియార్ ఆలోచనా వేదిక, మలికిపురం.

08. ఎం. గౌరవ్, పిఠాపురం, కుల నిర్మూలనా సమాఖ్య, కాకినాడ జిల్లా.

09. పెద్దింశెట్టి లెనిన్ బాబు, సామాజిక కార్యకర్త, అంగర.

10. మాకా రాజేంద్రన్, మార్పు స్వచ్ఛంద సంస్థ, రావులపాలెం.

11. ఎం.కరుణాకర్, అంబేద్కరిస్టు, కూనవరం.

12. నక్కా దేవిడ్ రాజు, ఉపాధ్యాయ సంఘ నాయకులు, ఆలమూరు.

13. కట్టా కృష్ణారావు, జాహ్నవి సాంస్కృతిక వేదిక, అనపర్తి.

14. జి.రవికుమార్, సామాజిక కార్యకర్త, ఆలమూరు.

15. కె.వి.వి. సత్యనారాయణ, జనవిజ్ఞాన వేదిక నాయకులు, యానాం.

16. పోతుల శేఖర్నాథ్, భూపతి నారాయణ మూర్తి స్మారక వేదిక, మల్కిపురం.

17. నల్లా సూర్య ప్రకాష్, ఆంధ్రప్రదేశ్ దళిత్ వాచ్, రావులపాలెం.

18. బి. శరత్ బాబు, అంబేద్కరిస్ట్, ముమ్మిడివరం.

19. ఏసురాజు, సామాజిక కార్యకర్త.

20. డా. మెహర్ ప్రసన్న, ప్రముఖ హోమియో వైద్యులు, మండపేట.

## కులం మూలాలను పెకిలించిన అంబేద్కర్...

డాక్టర్ బీఆర్ అంబేద్కర్ మహా మేథావి మాత్రమే కాదు. ఆయన కార్యశీలుడు. పుట్టిననాటి నుంచీ చివరి వరకూ అనేక కష్ట, నష్టాలకు ఓర్చి సమాజ ఉద్దరణకై కృషి చేశారు. చరిత్ర గమనాన్ని ఆయన శ్రద్ధతో అధ్యయనం చేశాడు. చరిత్రలో అస్పృశ్యుల జీవన స్థితిగతులను తన అధ్యయనం ద్వారా వీక్షించాడు. పీష్వాలు మహారాష్ట్ర దేశాన్ని పరిపాలిస్తున్నప్పుడు పుర వీధుల్లో హిందువులు నడుస్తున్నప్పుడు అస్పృశ్యుడు ఆ వీథిలో రాకూడదనేది నిబంధన. ఎందుకంటే అతని నీడ హిందువుని మైల పరుస్తుంది. అస్పృశ్యుడనే ఆనవాలు కోసం తన ముంజేతికి కాని, మెడకు కాని, నల్లని నూలు త్రాడును కట్టుకోవాలనే దుర్మార్గపు సాంఘిక అణచివేతను ఆయన ఎంతమాత్రమూ క్షమించలేదు. పీష్వాల రాజధాని పూనాలో అస్పృశ్యుడు తన నడుముకు వెనుక ప్రక్క ఒక పొడుగుపాటి చీపురు కట్టుకోవాలని, తన మెడకు ఒక మట్టి ముంత కట్టుకొని తన ఉమ్మి నేలపై ఎక్కడా వేయకుండా ముంతలోనే వేసుకోవాలనే అమానవీయమైన అణచివేతలోని లోతుపాతులను ఆయన అధ్యయనం చేశాడు. కుల నిర్మూలనపై అంబేద్కర్ దృష్టిసారించాడు. కులం పునాదులను వెతికి పట్టుకున్నాడు. హిందూమతంలో కులం తాలూకు వేర్లు ఉన్నట్టు గుర్తించాడు. కుల నిర్మూలనకై ఒక నిర్ధారణకు వచ్చాడు. అంచెంచెలుగా సాంఘిక ఉద్యమాలను చేస్తూ అనేక విజయాలను సాధించాడు.

ఎంతో విశిష్టతగల ఆయన్ను భారతదేశంలో కొన్ని పరిమితుల్లో ఉంచేశారన్న భావన కలుగుతుంది. మహా మేథాశక్తితో రాజకీయ, సాంఘిక, ఆర్థిక రంగాల్లో విశేషమైన కృషి చేసిన ఆయన్ను ఒక కులవాదిగా, రిజర్వేషన్లు కల్పించిన వ్యక్తి అనే పరిమితుల్లో ఉంచేశారు. ఆయన్ను పూర్తిగా అర్థం చేసుకోవాలంటే ఆయన రచనలను అధ్యయనం చేయాల్సిందే. అంబేద్కర్ సాంఘిక ఉద్యమాలకే పరిమితంకాలేదు. ఆయన బొంబాయి మురికివాడల్లో జీవిస్తూ అక్కడి కార్మిక వర్గంతో పనిచేశారు. ఇండిపెండెంట్ లేబర్ పార్టీని స్థాపించారు. అణగారిన వారికి విద్య అందించాలని ట్రస్టు ఏర్పాటు చేశారు. ఏదైనా చట్టం వచ్చినప్పుడు ఏ వర్గానికి ఎంత నష్టమో చాలా స్పష్టంగా పరిశీలించేవాడు. గ్రామాల్లో చాకిరీ చేయకండి పట్టణాలకు తరలిపోండని దళితులకు పిలుపునిచ్చాడు.

అంబేద్కర్ ఏదీ మాట్లాడినా అందులో పెద్ద అర్థమే ఉండేది స్వాతంత్ర్యమంటే ఒకరి అధికారంపోయి మరొకరు రావడం కాదు. పైవారి ప్రమేయంలేకుండా ఏర్పాటు చేసుకునే వీలు కలిగినదే స్వాతంత్ర్యం అన్నారు. మహిళలకు మాతృత్వ సెలవు ఇవ్వాలని డిమాండ్ చేశారు. భారతదేశ ప్రత్యేక పరిస్థితుల నేపథ్యంలో అన్నింటికన్నాముందు కులపోరాటం చేయాలన్నారు. కులాన్ని రద్దు చేయాల్సిందేనన్న నిర్ధారణకు వచ్చాడు. చివరి వరకూ కుల నిర్మూలనకై పాటుపడిన మహాశక్తి డాక్టర్ బీఆర్ అంబేద్కర్.

## ప్రముఖుల విశ్లేషణ వారి మాటల్లోనే...

### 01. కుల నిర్మూలన పుస్తకం ఒక మార్గదర్శి: డాక్టర్ చిలుకోటి కూర్మయ్య, బహుజన మేధావి, రచయిత రాజమహేంద్రవరం. సెల్: 83329 80181

డాక్టర్ బీఆర్ అంబేద్కర్ రచించిన కుల నిర్మూలన పుస్తకం కుల వివక్షను రూపుమాపాలన్న కాంక్షగలవారికి ఒక మార్గదర్శి. కుల పునాదులపై అంబేద్కర్ లోతైన విశ్లేషణ చేశాడు. తాను స్వయంగా అనుభవించిన వాటికితోడు సమాజంలో అణగారిన కులాల వారి బాధలకు ఆయన చలించిపోయాడు. కులాన్ని పైపైన కాకుండా దానికిగల మూలాలను వెతకాలన్న సంకల్పంతో మేథోమథనం చేశాడు.

కులం పునాదులు హిందూమతంలో వేళ్ళూనుకుపోయాయని గ్రహించాడు. ఆ మతానికి దూరం కావాలని నిశ్చయించుకున్నాడు. సమస్యలకు కారణంగా ఉన్న హిందూ మతాన్ని సంస్కరించడం నా పని కాదని స్పష్టం చేశాడు. హిందువుగా మంచినీళ్ళు తాగుతాను అన్నప్పుడు తాగనీయలేదనీ, ఆలయ ప్రవేశాన్నిఅడ్డుకున్నారనీ ఆవేదన వ్యక్తం చేశాడు. దళితులకు పౌరహక్కుల సంపాదించడమనేది ప్రధాన లక్ష్యమని ప్రకటించాడు.

ప్రపంచంలో మానవులందరికీ ఉన్న హక్కు దళితులకు కూడా ఉండాలన్నది ఆయన ఆశ. కుల వ్యవస్థలో ప్రధానమైన అంశాలను శాస్త్రీయంగా ప్రజల ముందుంచాడు. ప్రజల్లో ఆర్థిక స్థితి సమానమైనంత మాత్రాన కులం మాయమవుతుందన్నదాన్ని అంబేద్కర్ ఒప్పుకోలేదు. సోషలిస్టులు అనేవారు ఇప్పుడైనా; తర్వాతనైనా కుల సమస్యను ఎదుర్కొనాల్సిందే అని అంబేద్కర్ అన్నారు. కమ్యూనిజం శ్రమ విభజన గురించి చెప్పిందనీ, కానీ మొత్తం శ్రామికుడే విభజించబడ్డాడని అంబేద్కర్ అన్నారు.

వీరేశలింగం, రాజారామ్మోహనరాయ్ లు బ్రాహ్మణ కుటుంబాలను సంస్కరించే పనిని చేశారు. వారు చేసిన సంస్కరణ ఉద్యమాలు హిందూమత సంస్కరణ కాదని అంబేద్కర్ అన్నారు. హిందూ మతానికి ఆధారమైన గ్రంథాలన్నింటిలోనూ కుల వ్యవస్థను సమర్థించినవై ఉన్నాయన్నాడు. అందుకే ఆ మత గ్రంథాలు తప్పు అని అన్నాడు. హిందూమతాన్ని సంస్కరించాలనుకుంటే పూజారి వ్యవస్థ పుట్టుక నుంచి కాకుండా అర్హతే ఆధారంగా రావాలని అంబేద్కర్ అన్నారు. కుల నిర్మూలన పుస్తకాన్ని శ్రద్ధగా చదవడం ద్వారా కుల నిర్మూలనపై పూర్తి అవగాహన కలుగుతుంది.

### 02. కుల నిర్మూలన లక్ష్య సాధన దిశగా కృషి చేయాలి: మాకా రాజేంద్రన్, మార్పు స్వచ్ఛంద సంస్థ, రావులపాలెం. సెల్: 94915 18909

"మీరు లక్ష్యం ను గుర్తెరుగుట కన్నా, లక్ష్య సాధనా పద్దతులు గుర్తెరుగుట అత్యంత అవశ్యం." అని బాబాసాహెబ్ అంబేద్కర్ అన్నారు. 'కుల నిర్మూలన' అనేది ఒక లక్ష్యం అనుకుంటే దానికి లక్ష్య సాధనా పద్ధతులు అవసరం. 'రాజ్యాధికారం' అనేది ఒక లక్ష్యం అనుకుంటే దానికి లక్ష్య సాధనా పద్ధతులు అవసరం. పరిస్థితులు ఎలా ఉన్నా కనీసం స్వల్ప కాలిక కార్యక్రమాలు అయినా రూపొందించుకోవాలి. "మల్లె తీగకు పందిరి వేయకుంటే పక్కనున్న ముళ్ళ కంచె మీదకు

పాకుతుంది." అంటూ ఎన్కౌంటర్ ఎడిటర్ దశరథ రామ్ చెప్పిన మాటను గుర్తించుకోవాలి. కుల భూతాన్ని చంపి పారేస్తే తప్ప ఎలాంటి రాజకీయ సంస్కరణ గాని ఆర్థిక సంస్కరణలను సాధించలేరు.' అందుకే సోషలిస్టులు విప్లవానికి ముందే కుల వ్యవస్థ తో ఢీకొనాలి. లేకపోతే విప్లవం తరువాతనైనా దానితో తల పడక తప్పదు. మరొక విధంగా చెప్పాలంటే- సోషలిస్టులు ఏ దిక్కుకు తిరిగినా, దారికి అడ్డంగా నిలబడే పెనుభూతం కులవ్యవస్థ. కులమనేది మొదట్లో మతం పునాదుల మీద ఆర్థిక ప్రయోజనాలతో వృత్తి పరంగా విభజించబడి; తర్వాత సామాజిక వర్గాలుగా రూపాంతరం చెంది; నేడు రాజకీయంగా వ్యవస్తీకృతమై ఉంది. అంబేడ్కర్ కాలం నాటికి ఆర్య కులాల ప్రాబల్యం అధికంగా ఉండి, శూద్ర కులాలు చాలా హీనంగా చూడబడ్డాయి. ఇప్పుడు శూద్రులు నయా క్షత్రియ అవతారమెత్తి, వారి ప్రయోజనం నిమిత్తం బ్రాహ్మన్యాన్ని కాపాడ్డమే కాదు, ప్రోత్సహిస్తూ వస్తున్నారు. నయా క్షత్రియుల్లో లేదా శుద్రుల్లో ఒకటి రెండు కులాలు మాత్రం ఆధిపత్యం చెలాయించటం మొదలయ్యాకా, మరికొన్ని కులాలు వ్యవస్థీకృతం కావటం మొదలయ్యింది. కాపు నాడు, సెట్టిబలిజ మహానాడు ఆవిర్భావం అందుకు ఒక ఉదాహరణ.

అది జరుగుతుండగనే సమాజం పెట్టే చిత్ర హింసలకు ఎదురు నిలిచేందుకు, ప్రతిఘటించేందుకు దళితులు వ్యవస్థీకృతం అయ్యారనడానికి ఉదాహరణ దళిత మహాసభ ఆవిర్భావం. నయా క్షత్రియులు దళిత చైతన్యాన్ని దెబ్బ తీసేందుకు సామాజిక న్యాయం పేరున ఎస్సీ కులాల్లో వర్గీకరణ తెచ్చారు. దానితో కులాన్ని బలహీనంగా చూడక, దాన్నో బలంగా చూడ్డం మొదలయ్యిందనడానికి ఉదాహరణ ఎస్సీలు కూడా వారి పేర్ల వెనుక కులనామాలు తగిలించుకోవడం మొదలుపెట్టడమే.

బహుజన కులాలు, మైనారిటీ బహుజన కులాలు ఇప్పుడు వృత్తిపరమైన రక్షణల కోసం, సామాజిక రక్షణ కోసం వ్యవస్థీకృతం కావటం లేదు. అవిప్పుడు ఆర్థిక, రాజకీయ రక్షణల కోసం మాత్రమే ఆర్గనైజ్ అవుతున్నాయి. ఇలాంటి తరుణంలో కులాన్ని నిర్మూలించగలమా? అన్నది ఒక ప్రశ్న. బలహీన వర్గాలు కులాన్ని ఓ బలహీనత గా చూసినప్పుడు కుల నిర్మూలన ప్రతిపాదన వచ్చింది. బలహీన కులాలు వ్యవస్తీకృతమైన దరిమిలా, కులమే ఓ బలమనుకొంటున్నప్పుడు కులాంతర వివాహాలు పుట్టుకొస్తాయా? కుల నిర్మూలన జరుగుతుందా? కుల నిర్మూలనా పథంలో ఉన్న అభ్యుదయ కాముకులు సమిష్టి జీవనం లో లేనప్పుడు తోటి అభ్యుదయ వాదులకు అండ ఎలా దొరుకుతుంది? అసలిది చాలా ప్రాథమికమే కాదు, మౌలికమైన ప్రశ్న కూడా.....

"కుల నిర్మూలనా సమస్య దేశానిదా? దళితులదా?" ప్రపంచ బాధంతా దళితుడు తన బాధగా భావించాలా? కులాంతర వివాహాలు కులరహిత సమాజాన్ని నిర్మించగలకపోగా మళ్ళీ పురుష వారసత్వ కుల గుర్తింపే వస్తుంది. కులాంతర వివాహాలు సామాజిక స్థైర్యాన్ని ఇవ్వకపోగా ఒంటరి కుటుంబాలుగా మిగిలి పోతున్నాయి. ఒక విధంగా చెప్పాలంటే వెలి కుటుంబాలుగా మిగిలిపోతున్నాయి. దిగువ కులపోడు అధిపత్యకుల స్త్రీని వివాహం చేసుకొంటే దిగువ కుల స్థాయి మాత్రమే వస్తుంది. అధిపత్య కులపోడు దిగువ కుల స్త్రీని చేసుకొన్నా కూడా దిగువ కుల స్థాయి మాత్రమే వస్తుంది. ఇక్కడ కూడా మళ్ళీ పురుష వారసత్వ కుల గుర్తింపే వస్తుంది. కులాంతర వివాహాలకు ప్రభుత్వం ఏవిధంగానూ రక్షణగా నిలబడటంలేదు.

దళితులు, వామపక్ష వాదులు, దళితేతర అభ్యుదయ వాదులు...చార్వాక, లోకాయతుల వారసులు. వీళ్ళు గతి తర్కాన్ని విశ్వసించే వారు. గతి తర్కం చలన శీలతను ప్రతిపాదిస్తుంది. చలన శీలతలో మార్పులు అనివార్యం. ఆ మార్పును విస్మరించిన వారు వెనుకబడిపోతారు. గతి తార్కిక భౌతికవాద వారసులు కంటే భావవాదులే సమకాలీన పరిస్థితులకు తగ్గట్టు తమను తాము మలచుకొంటూ అభివృద్ధిలోకి వెళుతున్నారు.

'కులం అనేది భావాత్మక అంశమే'. కానీ, కులం - సమూహాలుగా ఏర్పడ్డాక భౌతిక రూపాన్ని సంతరించుకొంటుందని అంబేద్కర్ అన్నారు. అందుకే కుల నిర్మూలన గావించేందుకు భావ విప్లవం తెచ్చేందుకు ప్రయత్నంచడంతోపాటు బలహీన వర్గాల అభ్యున్నతికి పాటుపడాలి. ఆర్థిక స్థాయిని పెంచుకోవటం వల్ల వ్యక్తి స్థాయిని పెంచుకొగలం. సామాజిక పోరాటాలు ముందా, ఆర్థిక పోరాటాలు ముందా అనే చిక్కు ప్రశ్నలకు తావీయకుండా, సామాజికార్థిక పోరాటాలు రెండూ సమాంతరంగా చేపట్టిన నాడే బడుగు వర్గాల అభ్యున్నతి తద్వారా కుల నిర్మూలన సాధ్యమవుతుందని నా భావన.



సమాలోచనా సదస్సులో మాట్లాడుతున్న గౌరవ్, చర్చల్లో డా.చిలుకోటి కూర్మయ్య తదితరులు

## 03. మహనీయుల భావజాలాన్ని విస్తృతపర్చాలి: భూపతి శేఖర్నాథ్, భూపతి నారాయణ మూర్తి స్మారక వేదిక, మల్కిపురం. సెల్: 94919 95445

కులనిర్మూలన అనేది ఎంత మహత్తరమైనదో అందుకు అవసరమైన ప్రక్రియ కూడా అంతే మహోన్నతమైనదని గుర్తించడం అవసరం. డా. బి. ఆర్. అంబేద్కర్, కార్ల్ మార్క్స్, మహాత్మా పూలే మొదలైన మహనీయుల భావజాలాల్ని విస్తృతంగా అధ్యయనం చేసి కులనిర్మూలన పోరాటానికి ఒక కొత్త ఒరవడిని సృష్టించిన కీ. శే. భూపతి నారాయణమూర్తి, కీ. శే. ఊ. సాంబశివరావు (ఉ.సా), కీ. శే. కొత్తా శివమూర్తి , కీ.శే. శివసాగర్ వంటి యోధుల అధ్యయనం అత్యంత ప్రధానమని నా అభిప్రాయం. ప్రత్యామ్నాయ విధానాలని ప్రజాతంత్ర వైఖరితో అధ్యయనం చేయకుండా ప్రజాస్వామిక లక్ష్యాలని

నిర్దేశించుకోలేము. ఈ రోజు పీడిత ప్రజలంతా వివిధ రకాలుగా విడిపోయి ఉన్నారు. వాళ్ళ కోసమని ఉద్భవించిన పార్టీలు, సంఘాలు సైతం అనేక చీలికలుగా ఉన్నాయి. ఈ పరిస్థితులలో సుస్థిరమైన ఐక్యతా సూత్రాలను అనుసరించి అణగారిన ప్రజల పక్షాన పనిచేయడం ముఖ్యం.

మా వరకూ మేము పీడిత ప్రజల యోధుడు, దళిత బహుజన రచయిత కీ. శే. భూపతి నారాయణమూర్తి గారి అడుగుజాడల్లో నడుస్తూ; ఆయన బహుజన తాత్వికతని అధ్యయనం చేయడం దానిని నిర్మాణాత్మక మార్గాల ద్వారా ప్రజల్లోకి తీసుకెళ్ళడం కోసం పని చేయడం చేస్తున్నాము. అందులో భాగంగా రాజ్యాంగం పట్ల పౌరులకు అవగాహన తరగతులు నిర్వహించడం, స్కూల్స్, కాలేజీల్లో విద్యార్థులకి చిన్నతనం నుండే రాజ్యాంగం పట్ల గౌరవాభిమానాల్ని కలిగించడం, అందుకోసం ప్రతీ స్కూల్ లో రాజ్యాంగ ప్రవేశిక ని ఫొటోలా పెట్టేటట్లు చూడటం, మన తరపున అలాంటి ఫొటో లను తయారు చేసి కొన్ని ప్రభుత్వ స్కూల్స్, కాలేజీలకి ఇవ్వడం, ఉదయం ప్రేయర్ లో ప్రియాంబుల్ ని చదవడాన్ని ఒక ఆరోగ్యకర సాంప్రదాయం గా పాటించేలా ప్రోత్సహించడం వంటివి చేయొచ్చని నా అభిప్రాయం.

## 04. కులరహిత సమాజ నిర్మాణానికి ఐక్యత అవసరం: మలసాని శ్రీనివాస్, కులనిర్మూలన వాది, కాకినాడ. సెల్: 98483 50042

అన్నింటికన్నా కులానికి సంక్లిష్టత ఎక్కువ. కుల వివక్ష నేడు అంతగా కనిపించకపోవచ్చు కానీ క్షేత్ర స్థాయిలో అది పోలేదు. కుల రహిత సమాజ నిర్మాణానికి యావత్ భారతీయ ప్రజల ఐక్యత అవసరం. అధునాత సమాజంలో గ్లోబల్ ఎకానమీ వచ్చింది. మానవ సంబంధాలన్నీ పెట్టుబడిదారీ సంబంధాలుగా మారాయి. ఇక్కడ పోటీతత్వం సహజం. సమాజ స్వభావం ఇలా మారడానికి కారణం మారిన ఉత్పత్తి విధానమే. సమాజం మారినా కుల వివక్ష మాత్రం కొనసాగుతుంది.

ఈ నేపథ్యంలో నేడు బహుజనులు, కమ్యూనిస్టులు ఐక్యంగా కృషి చేయాలన్న భావనతో లాల్ నీల్ వంటి నినాదాలు ఉనికిలోకి వచ్చాయి. బహుజనులు, కమ్యూనిస్టులు వ్యక్తి ఆరాధనకు దూరంగా ఉండాల్సిన అవసరాన్ని గుర్తించాలి. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ సూచనలను నిర్దిష్ట పరిస్థితులకు అనుగుణంగా వర్తింప చేసుకోవాలి. ప్రజల విముక్తికోసం, బహుజనులు, కమ్యూనిస్టులు, ఇతర ప్రగతిశీల శక్తులు ఐక్యంగా ముందుకు సాగాలి. క్షేత్ర స్థాయీ పరిశీలన మేరకు ఉద్యమ నిర్ణయాలు తీసుకుంటుండాలి. దేశంలో అణగారిన కులాల అభ్యున్నతికోసం సాంఘిక ఉద్యమాలకు అధిక ప్రాధాన్యతనివ్వాలి. ప్రజల్లో అంబేద్కర్ రచనను చర్చకు పెట్టే కృషిని చేసిన నిర్వాహకులకు కృతజ్ఞతలు.

## 05. సమాజపరిణామ క్రమాన్ని అర్థం చేసుకోగలగాలి: డాక్టర్ చెలికాని స్టాలిన్, అధ్యక్షులు, డా.చెలికాని రామారావు స్మారక సమితి, రామచంద్రపురం. సెల్: 98493 48162

కుల నిర్మూలన పుస్తకం కులం మూలాలను అర్థం చేసుకునేందుకు, అవగాహనను పెంచుకునేందుకు ఎంతగానో దోహదపడుతుంది. భారతదేశంలో సాంఘిక అణచివేతపై డాక్టర్ బీఆర్ అంబేద్కర్ ఎనలేని కృషి చేస్తూ కుల నిర్మూలనకై

పాటుపడ్డారు. ఆయన చేసిన సాంఘిక ఉద్యమాలు కుల వివక్షను రూపుమాపేందుకు ఎంతగానో దోహదపడ్డాయి. దేశంలో కుల నిర్మూలన లక్ష్య సాధనలో ఆయన అనేక సాంఘిక ఉద్యమాలు చేసి విజయాలు సాధించగలిగారు.

కులం మూలాలను వెతకడంలో అనేక మంది ప్రముఖులు అనేక విధాలుగా ఆలోచనలు చేశారు. కమ్యూనిస్టుల అవగాహన మేరకు సాంఘిక సమస్యల మూలాలు దోపిడీ సమాజ నేపథ్యంలో ఉంటాయన్న అవగాహనకు వచ్చారు. సమాజంలో దోపిడీ చేసే వర్గం, దోపిడీకి గురయ్యే వర్గాలుగా చీలిపోయి ఉన్నందున దోపిడీ రహిత సమాజ నిర్మాణానికి కమ్యూనిస్టులు నడుంకట్టారు. దోపిడీ నశించినప్పుడు దోచుకునే వర్గమంటూ లేనప్పుడు సాంఘిక సమస్యలకు స్థానం ఉండదన్నది కమ్యూనిస్టుల అవగాహన. వర్గ విభజనను, దోపిడీని అర్థం చేసుకోగలిగితే సాంఘిక సమస్యల పరిష్కారం పట్ల కమ్యూనిస్టుల వైఖరిని అర్థం చేసుకోగలుగుతాం. అందుకు సమాజ పరిణామ క్రమాన్ని అర్థం చేసుకోవాలి.

వానరం నరుడుగా పరిణామం చెందిన నాటి నుంచి మనిషి తన శ్రమతో తనదైన శైలిలో అభివృద్ధి చెందుతూ వచ్చాడు. ఆదిమ సమాజంలో మనిషి సామూహికంగా శ్రమించి ఆహారాన్ని ఉత్పత్తి చేసుకుని ఆ ఆహారాన్ని సమానంగా వినియోగించుకునేవారు. అంటే మానవుని తొలినాళ్ళు ఉమ్మడి శ్రమ, సమాన ప్రతిఫలం అనే ప్రాతిపథికలపై వర్గరహితంగా గడిచాయి. తర్వాత కాలంలో శాస్త్ర సాంకేతిక రంగాల్లో అభివృద్ధి జరిగిన నేపథ్యంలో ఉత్పత్తి మిగులుదశకు చేరింది. ఉత్పత్తికి ప్రధాన కారకాలైన భూమి, యంత్రాలు, ఫ్యాక్టరీలు, పెట్టుబడి తదితర ఉత్పత్తి సాధనాలను ఒక వర్గం చేజిక్కుంచుకుంది. ఉత్పత్తి సాధనాలు కలిగిన వర్గమే ఉత్పత్తిని చేజిక్కించుకోవడంతో దోపిడీ వర్గంగా పరిణామం చెందింది. ఉత్పత్తికై శ్రమించినవారు దోపిడీకి గురికాబడిన వర్గంగా మారారు.

మొత్తంగా ఇలా దోచుకునే వర్గం, దోపిడీకి గురయ్యే వర్గంగా సమాజం విభజితమైంది. వర్గ సమాజాలుగా పరిణామం చెందాక అత్యధిక మానవుల జీవితాలు దుర్భరంగానూ అల్ప సంఖ్యాక వర్గీయుల జీవితాలు భోగభాగ్యాలతో కూడినవిగానూ మారాయి. ఈ వర్గ సమాజం నేపథ్యం కాస్తా మానవుల మధ్య పెత్తందారీ, దోపిడీ, అణచివేతలు పెచ్చరిల్లాయి.

దోపిడిపై తిరగబడకుండా ప్రజలను చైతన్యరహితులుగా చేసేందుకు మత భావనలను ప్రజలపై ప్రచారం చేశారు. భారతదేశంలో హిందూమత భావనలలోంచి చాతుర్వర్ణ వ్యవస్థను ప్రజలపై రుద్దారు. పరిణామక్రమంలో ఆ వ్యవస్థ కులాలుగా పరిణామం చెందాయి. భౌతికవాద దృక్పథం కలిగిన కమ్యూనిస్టులు భావవాద భావజాలం నుంచి పుట్టుకొచ్చిన మనుస్మృతిని వ్యతిరేకించారు. కులం పేరుతో అత్యధిక ప్రజలను వివక్ష, అణచివేతకు గురిచేశారు. దోపిడి వర్గం వెదజల్లిన మత, కుల భావనలను రూపుమాపాలంటే దోపిడీ రహిత సమాజాన్ని స్థాపించడమే సకల సమస్యలకూ పరిష్కారమన్న నిర్ధారణకు వచ్చారు. దోపిడీ రహిత సమాజ నిర్మాణంకోసం కృషి చేస్తూనే సాంఘిక సమస్యలు తలెత్తిన ప్రతీసారి కమ్యూనిస్టులు పోరాటాలు చేస్తూ వస్తున్నారు.

అనేకమంది కమ్యూనిస్టులు కులాంతర వివాహాలు చేసుకొన్నారు. మన ప్రాంతంలో సైతం అనేక ఉదాహరణలున్నాయి. మండపేటకు చెందిన కమ్యూనిస్టు నాయకుడు పాలచర్ల పనసరామన్న వారి పొలంలో పనిచేసే కూలి కుమార్తెను వివాహం చేసుకున్నారు. ఆ వివాహానికి ఆయన తల్లి, ఇతర కుటుంబ సభ్యులు అంగీకరించడం ద్వారా కమ్యూనిస్టు

కుటుంబాలు ఆదర్శంగా ఉంటాయనడానికి నిదర్శనంగా నిలిచారు. చిట్టూరి ప్రభాకర చౌదరి, కొరపాటి పట్టాభిరామయ్యలు తదితరులెందరో కులాంతర వివాహాలు చేసుకున్నారు.



సదస్సులో మాట్లాడుతున్న మలసాని శ్రీనివాస్, చర్చలో కరుణాకర్ తదితరులు

## 06. కులనిర్మూలన తక్షణ అవసరం: మురాల కరుణాకర్, ఫారెస్ట్ రేంజ్ ఆఫీసర్, రాజమహేంద్రవరం

సెల్: 79897 85623

ఉదయం లేచిన దగ్గర్నుంచీ సమాజంలో కులం ఎంత బలంగా వ్యవస్థీకృతం అయ్యిందో స్పష్టంగా కనిపిస్తుంది. వృత్తిరీత్యా షెడ్యూల్ ప్రాంతాల్లో పర్యటించాను. అంబేద్కర్ ఆలోచనలు వారికి దరిచేరలేదని గ్రహించాను. అందుకే కులనిర్మూలన ఈ రోజు తక్షణావసరంగా భావిస్తున్నాను. అంబేద్కర్ ను స్ఫూర్తిగా భావించే గిరిజన విద్యార్థి, యువత, ఉద్యోగులు అరుదుగా వున్నారు. కులాన్ని కూకటి వేళ్ళతో పెకలించి వేయకుండా సమానత్వం సాధ్యం కాదు. ఈ దేశంలో అంబేద్కర్ ని విగ్రహాలకే పరిమితం చేసిన మనం ఆయన్ని విశ్వమానవ సౌభ్రాతృత్వానికి ప్రతీకగా గుర్తించ నిరాకరిస్తున్నాం. ఈ పరిస్థితి మారాలి. కులనిర్మూలన మహత్తర గ్రంథానికి 86 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా ఆ పుస్తకాన్ని ముందస్తుగా అణగారిన వర్గాల ప్రజలందరూ చదవాలి. ఆలోచనాపరులు వాళ్ళ చేత చదివించాలి. ఆ పుస్తకం పై నిర్మాణాత్మక విశ్లేషణలు రావాలి. భిన్నాభిప్రాయాల సంగమాల సమాహారమే సమస్య పరిష్కారానికి దారి చూపగలదు. కులనిర్మూలన కోసం మహనీయ బాబాసాహెబ్ అంబేద్కర్ వేసిన బాటలో నడవడమే ఈ దేశంలో కులానికి సమాధి కట్టడానికి మనం వేసే అడుగని నా అభిప్రాయం.

**07. ఉద్యమాల తీరు మారాలి: నక్కా దేవిడ్ రాజు, ఎస్సీ,ఎస్టీ, మైనారిటీ ఉద్యోగుల సంక్షేమ సంఘం నాయకులు, రావులపాలెం. సెల్: 79816 96481**

వాపును చూసి అదే బలమనుకునే బలుపుతో ఈ రోజు ఉద్యమాలు ఉన్నాయి. ప్రజల్లోకి క్షేత్రస్థాయిలో వెళ్ళి పని చేయకుండా ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడం, మార్పుకోసం ప్రయత్నించడం సాధ్యం కాదు. నిర్దిష్టమైన ప్రణాళికతో కూడిన కార్యాచరణ, దానికి వ్యూహాత్మక కొనసాగింపు లేకుండా తూ.తూ మంత్రంలా చేసే కార్యక్రమాల వల్ల ప్రయోజనం లేదని నా అభిప్రాయం. ఈ రోజు కులానికి వ్యతిరేకంగా మాట్లాడే వారు సైతం సొంత కుటుంబాలలో కులాంతర వివాహాలకి మద్దతివ్వడానికి ఎంత వరకు ముందుకు వస్తున్నారనేదొక ప్రశ్న. కులనిర్మూలన ఉద్యమానికి సంబంధించిన ప్రణాళిక ప్రధానం. ముందు అటువంటి ప్రయత్నం చేయాల్సి ఉంది. అలా కాకుండా నేల విడిచి సాము చేయడం నిష్ప్రయోజనమని నా అభిప్రాయం.

**08. హక్కుల పోరు అంబేద్కర్: ఆకుమర్తి రవి, మానవహక్కుల వేదిక, అమలాపురం. సెల్: 99492 94256**

ఈ దేశంలోని పీడిత సమూహాల హక్కుల కోసం గొంతెత్తిన డా. బి. ఆర్. అంబేద్కర్ నిజానికి హక్కుల యోధుడు. కులనిర్మూలన పోరాటం అణగారిన ప్రజల హక్కుల పోరాటం. పౌర సమాజంలో కులనిర్మూలన గురించిన స్పృహను విస్తారంగా పెంచడం, అలాగే కులనిర్మూలన అవసరాన్ని గురించిన స్ఫూర్తిని విచక్షణతో వ్యాప్తికి తీసుకొచ్చే కృషి చేయడం ద్వారా మాత్రమే కులనిర్మూలన సాధ్యం. అందుకోసం మానవ హక్కుల వేదిక ఈసరికే అనేక చోట్ల పదుల సంఖ్యలో చిన్న చిన్న అవగాహన సమావేశాలు నిర్వహించడం జరిగింది. ఈ సమాలోచన ప్రయత్నాన్ని ఇంకా ముందుకు తీసుకుపోడానికి కూడా మా వంతు సహకారం కచ్చితంగా అందిస్తాం.

**09. కుల నిర్మూలన పోరాటాల చరిత్ర సుధీర్ఘమైనది: పాతగొలుసు రవికాంత్, సహవాసి స్వాభిమాన వేదిక, కోరుకొండ. సెల్: 96424 89241**

కులమనేదొక అనాగరిక స్వభావంగా గుర్తించడం భారతీయ నాగరికతా పరిణితికి ప్రమాణం. కులనిర్మూలన పోరాటం ఈ నేల మీద ఈనాటిది కాదు. చార్వాక, లోకాయతలు మొదలుకొని బౌద్ధ, జైనాల వరకూ కుల వ్యతిరేక పోరాటాల చరిత్ర సుదీర్ఘకాలం ఉంది. ఈ రోజు కులతత్వం కొత్త రూపాల్లో బుసకొడుతోంది. కులానికి వంతపాడుతున్న మతోన్మాదాన్ని మట్టుపెట్టకుండా కులనిర్మూలన సాధ్యం కాదు. అందుకు బాబాసాహెబ్ రచనలను అధ్యయనం చేయడమే మన ఆయుధం కావాలి. అలా భిన్న భావాల్ని ఆచరణ వైపుగా సమాయత్తం చేయడానికి ఈ సమాలోచన సమావేశం దారి తీస్తుందని ఆకాంక్షిస్తున్నాను.



కుల నిర్మూలన పుస్తకంపై చర్చిస్తున్న డా.చల్లా రవికుమార్, ముత్యాల శ్రీనివాసరావు, రవికాంత్, తదితరులు

**10. కుల రాజకీయాల పాత్ర పెరిగింది:** ముత్యాల శ్రీనివాసరావు, పెరియార్ ఆలోచనా వేదిక, మలికిపురం.

సెల్: 95532 00201

కులం పేరిట రాగద్వేషాలకు లోనుకాగల వ్యవస్థలో కుల రాజకీయాలే ప్రధాన పాత్ర పోషిస్తాయి. కులవ్యవస్థని బలోపేతం చేయడం ద్వారా స్వప్రయోజనాలు నెరవేర్చుకునే అగ్రకుల భావజాలమే వ్యవస్థని శాసిస్తాయి. వ్యవస్థలో వేళ్ళూనుకుపోయిన కుల భావనలకు వ్యతిరేకంగా పోరాడటమనేది నిర్మాణాత్మకంగా సాగాలి. ఆలోచనాపరులంతా ఒక్కతాటి పైకి రావాల్సి ఉంది. అందుకు ఒక ఆలంబనగా ఈ రోజు జరిగిన సమాలోచన వేదిక కాగలదని ఆశిస్తాను.

**11. అంబేద్కర్ రచనల అధ్యయనం అవసరం:** బి. శరత్ బాబు, అంబేద్కరిస్ట్, ముమ్మిడివరం.

సెల్: 94412 37510

కుల నిర్మూలన పుస్తకంపై చర్చా కార్యక్రమం నిర్వహించడం నేటి పరిస్థితుల నేపథ్యం అత్యవసరం. రావులపాలెంతో పరిమితం కాకుండా ఈ సమాలోచనా కార్యక్రమాలు జిల్లాలోని క్షేత్ర స్థాయిలో కొనసాగించాలి. బహుజనుల్లో ఆలోచనల్ని ప్రేరేపించాలి. అందుకోసం ఒక చిన్న ప్రయత్నంగా తదుపరి సమాలోచన సమావేశం ముమ్మిడివరంలో ఏర్పాటు చేయాలనుకొంటున్నాను. ప్రముఖులు ఆయా కార్యక్రమాల్లో సైతం భాగస్వాములు కావాలని కోరుకుంటున్నాను.

**12. ప్రత్యేక సిలబస్ రూపకల్పన అవసరం:** గండి స్వామి ప్రసాద్, జిల్లా అధ్యక్షులు, సేవాస్తంభ్ అవిభక్త తూ.గో.జిల్లా.

సెల్: 9949284754

కుల నిర్మూలన గ్రంథం సామాజిక మార్పునకు మార్గదర్శిలాంటిది. ఆ గ్రంథాన్ని అందించిన అంబేద్కర్ కు అందరూ కృతజ్ఞులే. విద్యావ్యవస్థలో ప్రత్యేకంగా కరిక్యులంలో కుల నిర్మూలన, మత సామరస్యం కోసం ప్రత్యేక సిలబస్

రూపొందించడం ద్వారా కులనిర్మూలనకు దోహదపడుతుంది. కులాంతర మతాంతర ప్రత్యేక వివాహ పరిరక్షణ చట్టంను తీసుకురావాల్సిన అవసరం ఉంది. ప్రత్యే వివాహాలను చేసుకునే సందర్భంలో వధూవరుల ఫోటోలను సంబంధిత కార్యాలయాల్లో నోటీసు బోర్డులలో ప్రదర్శించే విధానాన్ని తొలగించాలి. కులాంతర, మతాంతర వివాహాలను చేసుకొన్న అణగారిన వర్గాల వారికి ప్రత్యే రిజర్వేషన్లు కల్పించడం ద్వారా సామాజిక భద్రత కలిగే అవకాశం ఉంటుంది.

## 13. సమస్య పరిష్కారం ఆర్థిక స్వావలంబనతో ముడిపడి వుంటుంది: జి.రవికుమార్, సామాజిక కార్యకర్త, ఆలమూరు. సెల్: 93901 41714

కులనిర్మూలన గ్రామస్థాయిలో ఆర్థిక స్వావలంబన తో ముడిపడి ఉంటుందనేది నా అభిప్రాయం. ఆర్థికంగా పరిపుష్టి సాధించిన వ్యక్తులు సాంఘికంగా, సాంస్కృతికంగా ఎంతో కొంత పురోగతిలో ఉంటారనేదానికి నా కుటుంబ జీవితమే సాక్ష్యం. డా. బి. ఆర్. అంబేద్కర్ ఆలోచనల పై ఇలాంటి సమాలోచన కార్యక్రమాలు విద్యార్థులతో ఆలమూరులో కూడా ఏర్పాటు చేస్తాం. ఇంతటి లోతైన చర్చ జరిగిన ఈ సమాలోచన ద్వారా నేనెంతో నేర్చుకున్నాను.

## 14. భిన్నాభిప్రాయాలున్నా అంతిమ లక్ష్యం ఒక్కటికావాలి: కె.వి.వి. సత్యనారాయణ, జనవిజ్ఞాన వేదిక నాయకులు, యానాం. సెల్: 85000 09953

మనందరి మార్గాలు భిన్నమైనవి కావచ్చును కానీ లక్ష్యం మాత్రం ఒక్కటే. ఉద్యమ శ్రేణులు వేరుగా ఉండొచ్చు కానీ ఉద్యమిస్తున్న ధ్యేయం ఒక్కటే. కాన చిన్న చిన్న అభిప్రాయభేదాలు ఉన్నప్పటికీ కలిసి పని చేయదగ్గ అంశాలలో సమిష్టి కార్యాచరణ ఏర్పాటు చేసుకుని కలుపుకుపోదాం. వ్యక్తిగత విషయాలను విస్మరించి సహేతుక విమర్శల్ని హుందాగా ఆహ్వానిద్దాం. పది మంది కోసం పనిచేస్తున్న వారిని మన వంతుగా వెన్ను తట్టి ప్రోత్సాహిద్దాం. అభిప్రాయాలను విమర్శనాత్మకంగా, విభేదాలను మిత్రపూరితంగా స్వీకరిద్దాం. ఈ సమాలోచన ఒక మంచి ముందడుగు. దీనిని మరింత మెరుగుపరచడం మనందరి కర్తవ్యంగా గుర్తిద్దాం.



మాట్లాడుతున్న సాహితీవేత్త కట్టా కృష్ణారావు,చర్చలోదేవిడ్ రాజు, సూర్యప్రకాష్ తదితరులు

## 15. కులం మూలాలను పెకిలించాలి - డాక్టర్ చల్లా రవికుమార్, సంగమం సాంస్కృతి వేదిక నిర్వాహకులు, మండపేట. సెల్: 94405 07775

నిర్వాహకుల ప్రయత్నం వల్ల మహనీయుడు అంబేద్కర్ రాసిన కుల నిర్మూలన పుస్తకాన్ని మరొక సారి చదివే, పునరుచ్చరణ చేసుకునే అవకాశం దక్కింది. కుల నిర్మూలన అంశం ఆదర్శమా? అవసరమా? అన్న విషయంలో స్పష్టత చాలా అవసరం. హిందూ మతాన్ని సంస్కరించే ప్రయత్నాన్ని అనేక మంది సంస్కర్తలు చేశారు. కానీ సంస్కరణతో పెద్ద ప్రయోజనముండదని, దాన్ని మూలనుంచి పెకిలించాలని అంబేద్కర్ తన కుల నిర్మూలన గ్రంథలో పేర్కొన్నారు.

భారతదేశంలో కుల వ్యవస్థ వేల సంవత్సరాల పాటు స్థిరీకరించబడింది. మానవ చరిత్ర పరిశీలించినప్పుడు పరిణామ అవసరంలో గణాలు, గణ సమాజం ఏర్పడ్డాయి. గణ సమాజం తరువాత దశలకు పరిణామం చెందింది. కానీ అట్టి అవకాశం లేకుండా కులవ్యవస్థ శ్రామికులైన అత్యధిక శూద్రులను బానిసలను చేసింది అని అంబేద్కర్ తన కుల నిర్మూలన గ్రంథంలో పేర్కొన్నారు.

చాలా ప్రపంచ దేశాల్లో వ్యక్తిగత సామర్థ్యాల ఆధారంగా వారి ప్రాధాన్యతలు, సామాజిక హోదాలు గుర్తించబడ్డాయి. కానీ భారతదేశంలో మనుషులు కులవ్యవస్థలో స్థిరీకరించబడటం వల్ల అలా వికసించే అవకాశమేలేకుండా పోయిందని అంబేద్కర్ తన పరిశీలనతో చెప్పారు. వర్ణాంతర వివాహాలు జరిపించడం ద్వారా రక్త సంకరణం జరిగి కులవ్యవస్థ పోతుందని అంబేద్కర్ సూచించాడు. కానీ భారతదేశం లోని ఆర్థిక అంతరాల వర్గ వ్యవస్థ దీనికి ఆటంకమవుతుందని ఆయన భావించలేదు.

భారతీయ సమాజ పురోగమనానికి ఆటంకంగా ఉన్న కులవ్యవస్థ వల్లే సమాజం ఏక రూపత గలిగిన ఒక జాతిగా కానీ, నేషన్ గా కానీ అవ్వడానికి అవకాశం ఏర్పడలేదని, ఉమ్మడి ఐక్య రూపంగా రూపొందని తన దేశ జాతి, జాతీయతల గురించి అంబేద్కర్ తీవ్ర ఆవేదన వ్యక్తం చేశారు. పూర్వ చరిత్రను విశ్లేషిస్తూ ఒకప్పటి భారతదేశం నేడున్న దేశంగా ఉండేది కాదు. మహ్మదీయుల రాక తర్వాత వారి అవసరం కోసం చేసిన కార్యకలాపాలు వల్ల భారతదేశం ఐక్యమైంది అని ఆయన

అభిప్రాయం వ్యక్తం చేశారు. ఆర్థిక వ్యవస్థ, పురోగమనానికి, బలోపేతానికి కుల వ్యవస్థ విఘాతం కలిగించింది.అందుకే కులం శ్రమ విభజన కాకుండా శ్రామికుల విభజనగా మారిందని అంబేద్కర్ పేర్కొన్నారు.

ప్లేటో ప్రాచీన మానవ సమాజాన్ని 3 ప్రధాన వర్గాలుగా విభజించాడు. శారీరక శ్రమ చేసే వర్గంగానూ, రక్షణ బాధ్యత చూసే వర్గంగానూ, మేధావి వర్గంగానూ సమాజాన్ని ప్లేటో వర్గీకరించాడు. ఈ రకంగా సాధారణీకరించబడిన వర్గీకరణను అంబేద్కర్ ఆశాస్త్రీయంగా భావించారు. మానవుని ప్రతిభ, నైపుణ్యాలను అనంతమైనవి, భిన్నమైనవి, వైవిధ్యమైనగా ఆయన పేర్కొన్నారు. అతి ఇరుకు వర్గీకరణలు మానవుని అనంతమైన ప్రతిభా సామర్ధ్యాలను కించపరచటంగా భావించారు. నూతన సమాజ నిర్మాణానికి కుల నిర్మూలన ఉద్యమాలకు, రాజకీయ సంస్కరణల ఉద్యమాలకు సమాన ప్రాధాన్యతనివ్వాలని ఆయన తన కుల నిర్మూలన గ్రంథంలో పేర్కొన్నారు. సాంఘిక ఉద్యమానికి ఆయన అత్యంత ప్రాధాన్యతనిచ్చారు. అంబేద్కర్ జీవించిన కాలంతో పోల్చినప్పుడు కులవివక్షా రూపం అంత తీవ్ర రూపంగా ఈనాడు లేదు. నేటి సమాజం అనేక మార్పులు సంతరించుకుంది.. కానీ అంబేద్కర్ విశ్లేషించినట్టే కుల ఆధిపత్య భావజాల రూపం నేటికీ ఏదో రూపంలో ఉనికిలోనే ఉంది. కుల నిర్మూలనకై ఆ భావజాలాన్ని రూపుమాపాల్సిన అవసరం వర్తమాన సమాజం మీద ఎంతైనా ఉంది.

సాంఘిక వ్యవస్థ గురించి అంబేద్కర్ విశ్లేషణ ప్రకారం అర్హతమీద ఆధారపడి వర్ణం రాగా, పుట్టుకమీద ఆధారపడి కులం ఉనికిలోకి వచ్చింది. వర్ణ వ్యవస్థను ఆర్యులు ఏర్పాటు చేస్తే కులాన్ని ఆనాటి బ్రాహ్మణులు ఏర్పాటు చేశారు. విబేధాలు అగ్ర, అణగారిన కులాల మధ్యనే ఉంటుందనుకోవడం సరికాదని కుల చిచ్చు ఏ రెండు కులాల మధ్యనైనా రేగుతుందని అంబేద్కర్ విశ్లేషించారు. బ్రాహ్మణ, క్షత్రియ వర్గాల మధ్య ఘర్షణ నేపథ్యంలోనే భగవద్గీత వచ్చిందని అంబేద్కర్ ఒక ఉదాహరణగా తన కుల నిర్మూలన గ్రంథంలో ఉటంకించారు. అందరికీ సమాన అవకాశాలు ఇస్తోందని చెప్పబడుతున్న చాతుర్వర్ణ వ్యవస్థలో పైమెట్టుకి ఎదగాలనుకున్న శంభూకుడి ఆకాంక్షను, తలను ఆనాటి పాలక వ్యవస్థ తెగ నరికిందని అంబేద్కర్ తన కుల నిర్మూలన గ్రంథంలో ఉదాహరించారు. ఏకలవ్య కథ కూడా అదే విధమైన ఉదాహరణ. భారతదేశానని ఇతర ప్రపంచ దేశాలతో పోల్చి చూసినప్పుడు భారతీయులు నిత్యం యుద్ధాలతో కొట్టిమిట్టాడారు. కులవ్యవస్థలోని అసమానత్వం కారణంగానే హిందూ సమాజం ఐక్యం కాలేక పోయిందని, భద్రతకు, అనైక్యతకూ ఇదే కారణంగా అంబేద్కర్ పేర్కొన్నారు.

సంక్లిష్టమైన సాంఘిక నిర్మాణం లేక పోవడం వల్ల ఇతర దేశాల్లో ప్రజల్లో పోరాడే శక్తి అధికంగా ఉందని స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం కోసం ఆ దేశాల్లో ప్రజలు ఏకమయ్యారని అంబేద్కర్ విశ్లేషించారు. ఇతర దేశాల్లోలాగ భారతదేశంలో విప్లవం ఎందుకు రాలేదన్నడానికి అనేక కారణాలున్నాయి. ఇతర దేశాల్లోలాగ మత సంస్కరణలు, సాంఘిక సంస్కరణలు త్వరగానూ వేగంగానూ మనకు జరగలేదు. యూరోప్ లో మానవ హక్కులుకోసం ప్రజలు తెగించి పోరాడారు. కానీ భారతదేశంలో అసమాన సాంఘిక వ్యవస్థ, కర్మ సిద్దాంతం సర్దుకునే తత్వాన్ని అలవాటు చేసింది.

భారతదేశంలో రాజకీయ, ఆర్థిక ఉద్యమాలకు కులవ్యవస్థ ఒక ప్రతికూల అంశంగా మారిందని భావించారు. అందుకే అంబేద్కర్ రాజకీయ ఉద్యమంతో వ్యవస్థను మార్చుకోవాలని కోరుకునే వారు ఏదో ఒక విధంగా, అనివార్యంగా ఈ దేశ సాంఘిక వ్యవస్థతో తలపడక తప్పదని గట్టిగా వక్కాణించారు. ఈ ఆసమాన సాంఘిక వ్యవస్థ వల్లే బ్రిటిష్ కాలంలో, అంతకు

ముందు పాలకులు అంతర్యుద్దాలతో  కాలం గడిపారు. భారత దేశంలో కుల నిర్మూలనకు అంబేద్కర్ మార్గం నేటికీ ఆచరణ యోగ్యమైనది. సాంఘిక ఉద్యమాలను, ఆర్థిక పోరాటాలను పెనవేసుకుని నడపడం ద్వారానే ఈ సామాజిక వ్యవస్థను మార్చగలం. అటువంటి ఉమ్మడి ప్రగతిశీల పోరాటాలను బలోపేతం చేయాల్సిన అవసరాన్ని నేటి యావత్ ప్రజాసంఘాలు, ప్రగతిశీల శక్తులు గుర్తించాలి. అదే అంబేద్కర్ మహాశయునికి నిజమైన నివాళి.

## 16. వివక్ష మాత్రమే కాదు కులమనే భావననూ రూపుమాపాలి: కట్టా కృష్ణారావు, జాహ్నవి సాంస్కృతిక వేదిక, అనపర్తి. సెల్: 94901 86602

కులమనేది దోపిడీ వ్యవస్థ సృష్టి. దాని అంతం సైతం ఆ దోపిడీ వ్యవస్థను కూల్చడంపైనే ఆధారపడి ఉంది. కులానికి మతం పుణాది అయితే ఆ  మత భావనలు దోపిడీదారుల సృష్టించినవే. మతాన్ని సంస్కరించడం ద్వారా మానవాళి విముక్తికి కాలేదు. కచ్చితంగా దోపిడీ వ్యవస్థను రూపుమాపాల్సిందే. అందుకోసం కుల,మత,ప్రాంతాలకు అతీతంగా శ్రామికవర్గ జనమంతా ఐక్యంగా పోరాడాలి. ఆ పోరాటంలో సాంఘిక ఉద్యమాలు కీలకంగా వ్యవహరిస్తాయి. అందుకు అంబేద్కర్, కృషి, రచనలు ఎంతగానో ఉపకరిస్తాయి. సామాన్య ప్రజలు ఎడ్యుకేట్ కావడం దోపిడీ వర్గాలైన భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థలకు నచ్చదు. అందుకే తరతరాలుగా సామాన్యులను అందునా బహుజనులను చదువునుంచి దూరం పెట్టారు. ఆ చదువును అష్టకష్టాలకు ఓర్చి అంబేద్కర్ మహా జ్ఞాన సంపన్నుడయ్యాడు. సాంఘిక ఉద్యమాల నిర్మాణానికి అంబేద్కర్ ఎంతగానో ఆదర్శప్రాయం. అయితే సాంఘిక ఉద్యమాలకే పరిమితమైతే సామాన్యుల విముక్తి జరగదు. దోపిడీ వర్గాన్ని రూపుమాపాల్సిన అత్యవసర కర్తవ్యానికి ప్రగతిశీల శక్తులు ముందుకు రావాలి.

సమాలోచనా కార్యక్రమ ఆహ్వానపత్రిక

## *17. అంబేద్కర్ ఆలోచనా విధానాన్ని విస్తృతపర్చాలి: నల్లా సూర్య ప్రకాష్, ఆంధ్రప్రదేశ్ దళిత్ వాచ్, రావులపాలెం.*

**అంబేద్కర్ ఆలోచనా విధానం సామాన్య ప్రజల్లో విస్తృతపర్చాలి. జయంతి, వర్ధంతి కార్యక్రమాలను నిర్వహించడంతో సరిపెట్టుకోకుండా మహనీయుని రచనలను చర్చకు పెట్టాలి. ప్రతికూల భావనలు చలామనీలో ఉన్న నేపథ్యంలో అంబేద్కర్ లక్ష్యసాధనకై ఆయన ఆశయాలను, ఆయన బోధించిన కర్తవ్యాన్ని ప్రచారంలో ఉంచాలి.**

## 18. చర్చించడం ద్వారా అవగాహన పెరిగింది: జె. ఏసురాజు, సామాజిక కార్యకర్త. ఆలమూరు.

**సెల్: 94938 43748**

**సమాలోచనా సదస్సులో మంచి విషయాలు చర్చకు వచ్చాయి. కుల నిర్మూలన అనే అంబేద్కర్ పుస్తకంలో లోతైన విషయాలు తెలుసుకోగలిగాను. ఇలాంటి కార్యక్రమాలను క్షేత్ర స్థాయిలో నిర్వహించడం ద్వారా కుల నిర్మూలన లక్ష్యం నెరవేరేందుకు దోహదపడుతుంది. పస్తుత రోజుల్లో ఆ కృషి అవసరం కూడాను.**

## 19. మహిళా హక్కుల సాధనకై అంబేద్కర్ కృషి అమోఘం: డాక్టర్ మెహర్ ప్రసన్న, ప్రముఖ హోమియో వైద్యురాలు, మండపేట.

**అంబేద్కర్ మహోన్నత మేధావి. అన్ని వర్గాల ప్రజల పట్ల ఆయనకు అపారమైన అవగాహన ఉంది. అది ఆయన రచనలు ద్వారా వ్యక్తమవుతుంది. సాంఘిక ఉద్యమాలు చేసే క్రమంలోనూ, రాజ్యాంగ రచనలోనూ మహిళలకు తగిన ప్రాధాన్యతను ఇచ్చారు. మహిళా హక్కుల సాధనకై అంబేద్కర్ విశేషమైన కృషి చేశారు.**

కుల నిర్మూలన
తులనాత్మక పరిశీలన

డా. బి.ఆర్. అంబేద్కర్ మహత్తర గ్రంథానికి 86 సంవత్సరాలు!

సమాలోచన కార్యక్రమం

మే 15, ఆదివారం ఉదయం 10 గం॥లకు

ఏకలవ్య శిక్షణ కేంద్రం, కొత్తపేట రోడ్, రావులపాలెం, కోనసీమ జిల్లా.

భారతీయ సమాజం కులానికి కట్టు బానిస. ఇక్కడ దోపిడీ, పీడన కులంతో ముడిపడి ఉన్నాయి. కులానికి మతవిశ్వాసాల మద్దతు ఉంది. పురాణాల తాత్విక పునాది ఉంది. ప్రమాదకర అవకాశవాద రాజకీయాలున్నాయి. వీటన్నింటి చుట్టూతా పాతుకుపోయిన సాంస్కృతిక ఆధిక్యత ఉంది. కాబట్టి, కులనిర్మూలన జరగాలంటే, ముందుగా కులాధిపత్యాన్ని బద్దలుకొట్టాలి. అందుకోసం డా. బి.ఆర్. అంబేద్కర్‌ని అధ్యయనం చేయాలి. ఆ ప్రయత్నంలో భాగమే ఈ సమాలోచన.

కులం అసమానతకి మూలం. అణిచివేతకి ప్రధాన రూపం. అమానుషత్వానికి తిరుగులేని సారం. కులనిర్మూలన కోసం మూలాల్నీ, రూపాల్నీ, సారంతో సహా ఛేదించాలి. అందుకోసం శక్తివంతమైన ఆత్మగౌరవ సాధనాలు కావాలి. అలా చరిత్రలో జరిగిన ప్రయత్నాల్ని కూడా లోతుగా అధ్యయనం చేయగలగాలి. అలాంటి ఒక ముఖ్యమైన నిర్మాణాత్మక ఆయుధం, అంబేద్కర్ ఈ దేశపు అట్టడుగు ప్రజల కోసం ఎంతో ఆలోచించి, అందించిన "కులనిర్మూలన.' అందుకే ఆ అక్షరాయుధాలపై ఈ పరిశీలన.

కులం ఒక్కసారిగా నిర్మించబడింది కాదు. కులనిర్మూలన కూడా ఒక్క యత్నంలో పూర్తవదు. కులమెంత మానసిక భావనో అంతే భౌతిక ఆచరణ. ఎంతటి భావజాల ధోరణో, అంతటి భావోద్వేగ వైఖరి. కాన, కులనిర్మూలన బహుముఖ పాశ్వాల్లో బహుళ మార్గాల్లో జరగాల్సిన సుదీర్ఘ ప్రక్రియ. సాంద్రతతో కూడిన సమిష్టి సహకారంతో, ఆర్ద్రత నిండిన ఆలోచనల రూపకల్పనతో రూపుమాపాల్సిన దుర్మార్గం. కులం చరిత్ర, చరిత్రలో కులం పాత్ర తెలుసుకోవడం ద్వారా మాత్రమే ఇది సాధ్యం. అందుకే ఈ విశ్లేషణ.

రండి, కుల తత్వానికి వ్యతిరేకంగా గొంతు విప్పుదాం. కుల వివక్షతకు విరుద్ధంగా రాజ్యాంగబద్ధ చైతన్యాన్ని పౌర సమాజంలో నిర్మిద్దాం. దళిత బహుజనుల పై జరుగుతున్న అత్యాచారాల్ని, దాడుల్ని నిరసిస్తూ చేతులు కలుపుదాం. సమాజ వికాసానికి అడ్డుగోడగా ఉన్న కుల వ్యవస్థను సమిష్టిగా నిర్మూలిద్దాం. ప్రతీ మనిషికీ ఒకే విలువనే ప్రేమైక నినాదాన్ని సగౌరవంగా పాటిద్దాం. మహోన్నతమైన ఈ భూమిని సమానత్వ స్ఫూర్తితో గుబాళించే మానవీయ సౌరభాలతో నింపుదాం.

మనుషులుగా మన అస్తిత్వాన్ని అర్ధవంతం చేసుకుందాం !
కులనిర్మూలన ఉద్యమంలో భాగస్వాములౌదాం !!

సమాలోచనలో పాల్గొను కొద్దిమంది మిత్రులు

1. డా. చెలికాని స్టాలిన్, జన విజ్ఞాన వేదిక, రామచంద్రాపురం
2. డా. చైతన్య శేఖర్, హేతువాద సంఘం, రాజమండ్రి
3. డా. చల్లా రవికుమార్, సంగమం, మండపేట
4. డా. జి.సి. పట్టాభిరామయ్య, దుళ్ళ
5. మలసాని శ్రీనివాస్, సామాజిక విశ్లేషకులు, కాకినాడ
6. చిలుకోటి కూర్మయ్య, బహుజన రచయిత
7. ఆకుమర్తి రవి, మానవ హక్కుల వేదిక, అమలాపురం
8. మాకా రాజేంద్రన్, మార్పు స్వచ్ఛంద సంస్థ
9. పాతగొలుసు రవికాంత్, సహవాసి స్వాభిమాన వేదిక, కోరుకొండ
10. కట్టా కృష్ణారావు, జాహ్నవి సాంస్కృతిక సంస్థ, సర్పవరం
11. పెద్దింశెట్టి లెనిన్ బాబు, పుస్తకం గ్రూప్, అంగర
12. బత్తుల సిద్ధూ, ప్రగతిశీల విద్యార్థి సంఘం, వెదురుపాక
13. సత్యనారాయణ (కొండ), జగన్నాథగిరి
14. జె. మనోహర్, సి.ఎల్.సి.
15. ముత్యాల శ్రీనివాస్, పెరియార్ ఆలోచన వేదిక, మలికిపురం
16. శివప్రసాద్, పి.డి.ఎం, రాజోలు
17. సుధీర్, ఆ.పి.ఐ.
18. బి.వి.వి. సత్యనారాయణ, రచయిత
19. జి. రమ, చైతన్య మహిళా సంఘం
20. ఎమ్. కరుణాకర్, ఫారెస్ట్ రేంజ్ ఆఫీసర్

ఇంకా ఇతరేతర మిత్ర సంఘాల బాధ్యులు కూడా పాల్గొంటారు...

ముఖ్య విజ్ఞప్తి: ఈ కార్యక్రమంలో పాల్గొనదలిస్తే కచ్చితంగా డా.బి. ఆర్. అంబేద్కర్ "కులనిర్మూలన" చదివి రావాల్సి ఉంటుంది. పుస్తకం సాఫ్ట్ కాపీ కావాల్సినవారు కిందనున్న నంబర్‌కు వాట్సప్ రిక్వెస్ట్ పెట్టవచ్చు.

వివరాలకు : గౌరవ్, కుల నిర్మూలనా సమాఖ్య, సెల్ : 9032094492

**సమాలోచనా కార్యక్రమ ఆహ్వాన పత్రిక**

## 20. వర్గపోరాటంతో మానవాళి విముక్తి : పెద్దింశెట్టి లెనిన్ బాబు, సామాజిక కార్యకర్త, అంగర.

సెల్: 9866664333

భారతదేశంలో కుల ప్రభావిత దురాఘాతాలను రూపుమాపేందుకు డా. బీఆర్ అంబేద్కర్ తన కులనిర్మూలన రచనలో అనేక అంశాలను విశ్లేషించారు. ఆయన కృషి తాలూకు విషయాలను సమాలోచనా సదస్సులో ఇప్పటి వరకూ అనేకమంది తెలియజేశారు. వాటిలో అనేక విషయాలను ఏకీభవిస్తున్నాను. సాంఘిక ఉద్యమాల ప్రాధాన్యతకు చెందిన అంశాలను మరోసారి పునరుద్ఘాటించడానికి బదులు కుల నిర్మూలనపట్ల ఇతర భావనలనపై నా అభిప్రాయాన్ని చెప్పదలచుకున్నాను.

మానవాళి యావత్ సమస్యలకూ మూల కారణం ప్రజలు దోపిడీకి గురయ్యే వర్గం, దోపిడీ చేసే వర్గాలుగా విడివడి ఉండటమే. సకల సమస్యలు దోపిడీవర్గ ప్రయోజనాల నేపథ్యంలో ఉనికిలోకి వస్తున్నవే. మానవాళి విముక్తికై దోపిడీని రూపుమాపాల్సిన అవసరాన్ని గుర్తించాలి. సాంఘిక ఉద్యమాలకు పరిమితంకాకుండా దోపిడీ రహిత సమాజ నిర్మాణానికి నడుం కట్టాల్సిన అవసరం వుంది. సాంఘిక దురాచారాలకు కారణభూతమైన దోపిడీ మూలాలను తెలుసుకోకుండా ఉపరితలాన్ని ప్రతిబింబించే సాంఘిక ఉద్యమాలతో మాత్రమే మానవాళి సంపూర్ణంగా విముక్తి కాదు. మానసిక వికాసంతో, సుఖ సంతోషాలతో సమస్యలు లేని సంపూర్ణ మానవుడుని చూసేందుకు దోపిడీ నిరోధించాల్సిన అవసరముంది.

సంపదను సృష్టించే భూమి, ఫ్యాక్టరీలు, యంత్రాలు, తదితర ఉత్పత్తి సాధనాలను చేజిక్కించుకున్న దోపిడీ వర్గం తన సంపదను విచ్చలవిడిగా పోగుజేసుకుంటుంది. వాటిని సమాజపరం చేయకుండా వారి దోపిడీకి కళ్ళెం వేయలేము. వాటిని సమాజపరం చేసేందుకు విప్లవం అనివార్యం. ఆ ఉత్పత్తి సాధనాలు కలిగిన వారు ఏ కులానికి చెందినవారైనా దోపిడీదారులుగానే పరిగణించగలగాలి. దోపిడీ చేయడానికి, దోపిడీకి గురికావడానికి కులంతో పనిలేదు. దోపిడీ మూలాలు ఏ కులంలో వున్నప్పటికీ ఏ కులానికి చెందిన వాడి గూటిలో ఉన్నా పెకిలించాల్సిందే.

దోపిడీదారులు తమ దోపిడీ కార్యకలాపాల నుంచి ప్రజలను పక్కదారి పట్టించేందుకు కులాన్ని, ఆ కుల మూలాలున్న మతాన్ని, ప్రాంతీయ భావనలను ప్రజల్లో విస్తృతంగా ప్రచారంలో ఉంచుతారన్నారు. ప్రజలను పలు విధాలా విడగొట్టేందుకు కుల, మత, ప్రాంతీయ తత్వాలతో కృత్రిమ ఉద్యమాలను సైతం సృష్టిస్తున్నారు. దోపిడీదారుల బావజాలానికి లోనుకాకుండా దోపిడీ వ్యతిరేక ఉద్యమాల్లో ప్రజలు విరివిగా పాల్గొనడం ద్వారా దోపిడీ రహిత సమాజాన్ని నిర్మించుకోగలం. సమాజంలో దోపిడీ పోయాకా కులం, మతం వంటి సామాజిక, మత అంశాలు ప్రాధాన్యతను కోల్పోయి, క్రమక్రమంగా నిర్వీర్యమవుతాయి. ఆ ప్రక్రియ జరగనంతకాలం సాంఘిక ఉద్యమయాలు అడపా తడపా విజయవంతమవుతున్నప్పటికీ ఫలితాలు అరకొరగానే సమాజానికి అందుతాయి. కులాన్ని దోపిడీ వర్గం బలంగా మార్చుకోవడమే అందుకు కారణం. యువత పరాధీనతకు, వ్యక్తి పరాయీకరణకు, కమ్యూనిస్టుల ప్రభావాన్ని తగ్గింపునకు భాతీయ సంస్కృతి లోని సంక్లిష్టమైన అంశాల వెనుక బలమైన శక్తిగా దోపిడీ వర్గమే కారణం.

ప్రపంచంలోని పెట్టుబడిదారులంతా దేశాల హద్దులను చెరిపేసుకుని వ్యాపారం చేసుకుంటూ తమ సంపదను పెంచుకుంటున్నారు. భారతదేశీయ పెట్టుబడిదారులు విదేశీ పెట్టుబడిదారుల వ్యాపారాల్లో భాగస్వాములై వ్యాపారాలను

విస్తృతపర్చుకుంటున్నారు. తమ వ్యాపార కార్యకలాపాలకు మద్దతు పలికే వర్గాలను రాజ్యాధికారంలో ఉంచుకొంటున్నారు. దీంతో సుమారుగా 90 శాతం సంపద 10 శాతంగా ఉన్న సంపన్నుల చేతుల్లోకి వెళ్ళిపోయింది. 90 శాతంగా ఉన్న ఇతర ప్రజలు చేతుల్లో ఉన్నది కేవలం 10శాతం సంపద మాత్రమే. ఈ విషయాన్ని గమనించాలంటే వర్గదృష్టి అనివార్యం.

ఇంతటి దుర్మాగ పరిస్థితుల్లో ప్రజలు ఐక్యంగా ఉద్యమించాల్సిన అవసరం ఉంది. కులం,మతం, ప్రాంతం పేరుతో విడిపోవడం వల్ల అంతిమంగా సంపన్నులుగా ఉన్న దోపిడీదారులకే ప్రయోజనమన్న విషయాన్ని గమనించాలి. విముక్తికై దోపిడీని రూపుమాపాలని, అందుకు సాంఘిక ఉద్యమాలతో పాటు దోపిడీ రహిత సమాజానికై విప్లవం అనివార్యమన్న విశ్లేషనను కమ్యూనిస్టులు వ్యక్తీకరించారు.

ప్రగతిశీల శక్తులు విడిపోవడానికి వీలులేదు. అలా జరుగుతున్నది అంటే దోపిడీవర్గం తన ఎత్తుగడల్లో విజయవంతమవుతుందని అర్థం చేసుకోవాలి. శ్రామికవర్గాన్ని విడదీసేందుకు కులాన్ని, మతాన్ని, ప్రాంతీయ భావనలను ముందుకు తీసుకురావడం ద్వారా దోపిడీవర్గం తన ప్రాబల్యాన్ని కొనసాగించుకుంటుంది. ఆ స్పృహతో ఆలోచనాపరులంతా ముందుకు సాగాలి. సాంఘిక సమస్యలపై పోరాడుతూనే శ్రామికవర్గ విముక్తికై దోపిడీపై పిడికిలి బిగించాలి.

## 21. కృషిని కొనసాగిద్దాం... ఎం. గౌరవ్, పిఠాపురం, కుల నిర్మూలనా సమాఖ్య, కాకినాడ జిల్లా.

Cell: 90320 94492

ఈ ముగింపు రాసే సమయానికి అనంతపు రానికి చెందిన మిత్రురాలు వీణ భర్త మురళిని కులాంతర ప్రేమ చేసుకున్నారనే కారణంతో గొంతు కోసి హత్య చేసారు. వీణా కన్న తల్లే ఈ ఘాతుకాన్ని చేయించింది. పెళ్ళికి ముందు భయపడుతున్న మురళికి ధైర్యం చెప్పడానికి నేను చేసిన గదమాయింపులన్నీ ఒట్టివేనని తేలాయ్. 'హాయ్ అన్నా! నేను మురళి' అంటో ఆ తమ్ముడు చేసిన వాట్సప్ మెసేజ్ ఇప్పుడు శూన్యంగా నన్ను చూసి శాశ్వతంగా వెక్కిరిస్తోంది. ఈ దేశంలో కులోన్మాదం మనుషుల రక్తంలో, ఆలోచనల్లో ఇమిడిపోయింది. బహుముఖ పోరాటాలే కులనిర్మూలనకి శరణ్యం.

దేశ రాజకీయాలలో, సామాజిక రంగంలో లోతుగా, విస్తృతంగా పాతుకుపోయిన కులానికి సంబంధించిన అనేక అధ్యయనాలు జరిగాయి, ఇంకా జరగాల్సినవి కూడా ఉన్నాయి. వాటి విస్తృతితో తరచి చూస్తే 'కులనిర్మూలనా సమాఖ్య' పేరిట మేం చేసిన ప్రయత్నం చిన్నదే కావచ్చు కానీ కార్యాచరణ పట్ల వీలైనంత స్పష్టత చేకూర్చుకుందుకూ, విధివిధానాల ఎడల దిశానిర్దేశం చేసుకుందుకూ ఇదో ముఖ్యమైన ముందడుగని నా అభిప్రాయం. అందుకే డా. బి. ఆర్. అంబేద్కర్ 'కులనిర్మూలన' గురించిన ఈ మేధోమధనం.

దార్శనికతతో కూడిన సంవాదంగా జరిగిన ఈ సమాలోచనా సమావేశం రిపోర్టు ను నిబద్దతతో రికార్డు చేసి భిన్న స్వరాలని ఒక్క దరికి చేర్చిన క్రమానికిలా అక్షర రూపం కల్పించి, పొత్తంగా మల్చిన పెద్దింశెట్టి లెనిన్ బాబుకి కృతజ్ఞతలు తెలుపుతూ ఇదో ముఖ్య భూమికగా కులని ర్మూలనే ఇరుసుగా మరెన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలు సమిష్టిగా చేయడానికి 'కులనిర్మూలనా సమాఖ్య' ముందుంటుందని, తన కృషిని కొనసాగిస్తుందని తెలియజేస్తూ .. సెలవు.